శ్రీ గురవేనమః

# బ్రహ్మానంద శతకము

(తాత్పర్య సహితము)

ఇది

ఆశుకవి శిఖామణి
పూర్ణగురుసార్వభౌమ, నిజానంద
నరసింహ స్వాములవారిచే
రచియింపంబడి

తెనాలి
లక్ష్మీముద్రాక్షరశాలయందు
ముద్రింపించి, ప్రకటింపంబడియె.

1936



దీని వెల 4 అణాలు



శ్రీ శ్రీ శ్రీ స్వామి బ్రహ్మానందగిరిజీ.



పి. వి. నరసింహారావునాయుడు.

శ్రీగురవేనమః

# పీఠిక

## బ్రహ్మానందగిరిస్వాములవారి చరిత్ర.

సీ॥ శ్రీమీరాఁ గృష్ణాఖ్య ♦ జిల్లాను గన్నవ
రమను తాలూకాను ♦ రమ్యమైన
వీరవల్లి సమాఖ్య ♦ వెలయు గ్రామంబున
లలిని గమ్మాబ్ధిక ♦ ళానిధియగు
లక్ష్మయ్యచౌదరి ♦ లక్ష్మమ్మఁ బెండ్లాడి
రామాఖ్యునిఁ గనె ♦ రాజితముగ
నతఁడు లక్ష్మీకాంత ♦ సతిని వివాహమై
కడియాలవంశంబు ♦ ఖ్యాతినించె
తే॥ వారిగర్భంబునందునఁ ♦ బ్లవశరంబు
మాఖశుద్ధ సప్తమినాఁడు ♦ మహిజనించె
భరణిఁ గవివాసరమునఁగొ ♦ మరుఁడొకండు
భవ్య వేంకటరత్నాఖ్యుఁ ♦ బ్రబలుఁడగుచు. 1
సీ॥ ఆసుతునకును ద ♦ శాబ్దంబులగుదాఁక
జీవించి పరమును ♦ జెందెఁదల్లి
యవల రామయ్యయు ♦ నర్ధాంగిగాఁగ మా
ణిక్యాంబఁ జేకొనె ♦ నియతితోడ
నామె యాబాలుఁ బం ♦ చాబ్దముల్ పెంచిన
పత్నిమారంబునఁ ♦ బరముఁజెందె

సంత నారాయయ ♦ యతివ వేంకట రమ
ణాంబ నాసతినిబెం ♦ డ్లాడె నామె
తే॥ గనియె నలిమేలు మంగమ్మ ♦ యనుకుమారిఁ
బెంచెఁబదియేండ్లు సుఖముగాఁ ♦ బ్రియునిగలసి
యనలసుతను సుతుని భర్త ♦ నవవివీడి
పరమపదమును జేరెనా ♦ సరసిజాక్షి. 2

సీ॥ రామయ్య వేంకట ♦ రత్నకుమారున
కాంధ్రవిద్యను నేర్పె ♦ హర్షమెసఁగ
నాకుమారుండును ♦ వ్యాయామము లెఱింగి
బసవమాంబఁబడసె ♦ భార్యగాఁగ
నవలవేదాంతార్థ ♦ మరయంగఁ దలపోసి
సిద్ధార్థిఫాల్గున ♦ శుద్ధపూర్ణి
మంను బృహస్పతి ♦ యనుదినంబున నిప్ప
టము గ్రామమందున ♦ విమలమతియు
తే॥ శాంతుఁడును బోలకంవం ♦ సంభవుఁడగు
నారసింహాఖ్య వరశిష్యుఁ ♦ డైరహించు
రంగయార్యుల సేవించి ♦ బ్రహ్మవిద్య
నభ్యసించెను సద్భక్తి ♦ యలర నితఁడు. 3

సీ॥ రాజిల్లు కుప్పము ♦ రంగయార్యుల శిష్యు
లగుచు నర్థాంగితో ♦ నలరి యవల

గార్హస్థ్యధర్మంబు ♦ గాదని కడఁజిమ్మి
యోగిని వానప్రస్థ ♦ మొనరఁదాల్చి
నారలు క్రోధన ♦ నామశరంబున
వర్షర్తువందున ♦ హర్ష మెసఁగ
గురుల సాన్నిధ్యంబుఁ ♦ గుమరుకొనఁగ నెంచి
విభవ వత్సరమున ♦ విశ్రుతముగ

తే॥ వీరవల్లిని నాస్తిని ♦ విక్రయించి
యిప్పటంబున నెలకొని ♦ యెప్పుడుగురులఁ
గూడి బ్రహ్మవిచారంబు ♦ కొఱఁత లేక
సంశయముదీఱునందాఁక ♦ సల్పుచుండె. 4

సీ॥ వేంకటరత్నము ♦ వెలయఁగాఁ దనగురు
వైన కుప్పము రంగ ♦ యార్యుతోడ
విభవ కార్తికమున ♦ శుభబహుళదశమి
భారతోత్తరభూమిఁ ♦ బర్యటనము
సేయుచుఁగాశిలో ♦ నే యుండఁదన తండ్రి
శివరాత్రిఁ బరమంద ♦ శీఘ్రముగను
వచ్చెనవల శుక్ల ♦ భాద్రపదము శుద్ధ
మునఁ దృతీయను గవి ♦ దినమునందు

ఆ॥ విజయ నాటికకును ♦ విచ్చేసి గురుఁడును
బరమ పదముఁ జెంద ♦ వారిభవ్య

కాయ మిప్పటమను ♦ గ్రామమఠంబునఁ
దగసమాధిఁ జేసె ♦ సుగుణి యగుచు. 5

సీ॥ ఆగురుమూర్తి క్షి ♦ తాధికారంబీయ
నాత్మభక్తులకు వే ♦ దాంత భావ
ములను బోధింపుచుఁ ♦ జెలఁగుచోఁ గొందఱు
బ్రాహ్మణేతరులకు ♦ భవ్యమైన
యట్టికాషాయమం ♦ దధికార మేదియు
లేదనుమాటల ♦ లెస్సగవిని
యఖిలజనులకున్న ♦ దంచును జాటించి
తాసన్యసించి శా ♦ స్త్రవిధమునను

తే॥ మరల నాసేతు శీతాద్రిఁ ♦ దిరిగి సకల
నిగమ నిగమార్థ ధర్మముల్ ♦ నెఱినెఱింగి
పరఁగు నితఁడు బ్రహ్మానంద ♦ గిరియనంగ
దివ్యనామంబు ధరియించె ♦ భవ్యుఁడగుచు. 6

గ్రంథ స్వాతంత్ర్యము.

తే॥ గీ॥ శ్రీలనలరు నీకంద ప ♦ ద్యాళిఁబోక
లాన్వయ నరసింహరాయఁ ♦ డనెడు నేను
వరసుగుణి బ్రహ్మానంద ♦ గిరి యతికిని
సర్వకర్తృత్వ మొసఁగితి ♦ సత్యముగను.

శ్రీగురవేనమః

# బ్రహ్మానంద శతకము.

( కందపద్యములు )

## తాత్పర్యసహితము.



శ్రీనిత్య సత్యభావా!
జ్ఞానానందాత్మ! దివ్యసద్రూప మహా
మౌన ప్రకాశగురు దే
వా! నామాతీత భవ్య! బ్రహ్మానందా! 1

తా॥ కాలత్రయాబాధ్యవిజ్ఞానమూర్తియును, సత్యమగు బ్రహ్మభావము నెఱింగినవాఁడును, జ్ఞానానందమే దివ్యరూపముగాఁ గలవాఁడును, నధికప్రకాశమానుండును, నామరహితుండును నగు గురుమూర్తికి నమస్కారములు.

మీదివ్యపదాబ్జంబుల
కాదిని మీశిష్యవితతి యతిభక్తి మెయిన్
మోదమునఁగొల్చి యీకృతిఁ
బాదములను నిడుమయ్య బ్రహ్మానందా. 2

తా॥ గురువర్యా, మీయంకితంబుగ నొక కందపద్యశతకమును వ్రాయించి మీశిష్యులమగు మే మతిభక్తితో మీపదములముందుఁబెట్టి నమస్కరించుచున్నాము.

ధరఁ బోకల నరహరి గురు
వరు భక్తులు మేము వేఁడఁ ♦ బద్యశతంబుల్
విరచించిరి కందంబులఁ
బరిపూర్ణానంద మెసఁగ ♦ బ్రహ్మానందా. 3

తా॥ భక్తులమైన మేము, పోకల వేంకట నరసింహరాయ స్వాముల వారిని వేఁడ వారు కందపద్యములతో శతకముగా వ్రాసి యిచ్చిరి.

శ్రీ చెలువారఁగ ధరఁ బూ
ర్ణాచల భావంబుఁ బ్రకట ♦ నంబొనరఁగ శే
షాచల గురువరు లొనరిచి
ప్రాచుర్యము చేసినారు ♦ బ్రహ్మానందా. 4

తా॥ "అద్వైతను నిరసనానంద" 'అచలగురుఁడు' అను బిరుదములను బొందిన శ్రీ మాన్ పోకల శేషాచల స్వాముల వారు, అచలభావము లోకులకు విపులముగాఁ దెలియునట్లు గ్రంథముల రచియించి లోకమున వెదచల్లిరి.

ఆతని సూచన నెఱిఁగెను
ఖ్యాతిగ నిప్పటము పోల ♦ కం నరసింహా
ఖ్యాతుండు తెలిపెఁద త్త్వ
వ్రాతము రంగయ్య కోలి ♦ బ్రహ్మానందా. 5

తా॥ గుంటూరు జిల్లా, ఇప్పటము గ్రామకాపురస్థులయిన శ్రీమాన్ పోలకం నరసింహ స్వాములవారు మీఁదఁ జెప్పిన శ్రీమాన్ పోకల శేషాచలార్యుల వలన వేదాంతభావముల నశేషముగా నెఱిఁగి శ్రీమాన్ కుప్పమురంగయ్యగారికిఁ దెలిపిరి.

కుప్పము రంగయ గురువరుఁ
డొప్పుగఁ దాఁగాంచిమీదు ♦ నురుభక్తియెడన్
మెప్పొనరింపఁగ మిమ్ముల
రప్పించిరి బోధఁదెల్ప ♦ బ్రహ్మానందా. 6

తా॥ శ్రీమాన్ కుప్పము రంగయ్య స్వాముల వారు మీ భక్తికి మెచ్చి మిమ్ము వారి సన్నిధికి రప్పించి,యీపరిపూర్ణబోధను దెల్పిరి.

గురుభక్తియు నుపదేశము
సరిపడ సద్గ్రంథసమితిఁ ♦ జదివి నుముల ను
ద్ధరియింపఁ బూని తెంతయుఁ
బరిపూర్ణానంద తేజ ♦ బ్రహ్మానందా. 7

తా॥ ఓ బ్రహ్మానందస్వామీ! మీరు శ్రీసద్గురు భక్తికలిగి యుపదేశమును బొంది వారి బోధననుసరించి శాస్త్రజ్ఞానము గలిగి యనుభవమును బొంది మము నుద్ధరించితిరి.

భువి బ్రాహ్మణేతరులకు మ
గువలకు వేదాధికార ♦ గురుతగలదు భే

దవివక్షత లేదెందును
బ్రవిమల వర్ణాశ్రమముల ♦ బ్రహ్మానందా. 8

తా॥ మానవులయందే భేదమునులేక, బ్రాహ్మణేతరులును స్త్రీలును వేదములు చదువవచ్చును. అందఱును సర్వాశ్రమములను బొందవచ్చును.

మాయది బ్రాహ్మణజాతి సు
మీ యితరులు మమ్ముఁదాఁక ♦ మేల్గాదంచున్
గూయిడుదు రాత్మ నెఱుఁగక
పాయుదురే భ్రాంతివారు ♦ బ్రహ్మానందా. 9

తా॥ సర్వజీవులయందు సంపూర్ణముగా నిండియుండు నాత్మ యొక్కటియని తెలియఁజాలక, "మాది బ్రాహ్మణజాతి, మము ముట్టఁదాఁకరా" దని పల్కు బ్రాహ్మణ బ్రువులీ భ్రాంతి నెన్నఁడు విడువఁజాలరు

పుట్టినయప్పుడె శూద్రుఁడు
నెట్టనఁ గర్మలనొనర్ప ♦ నిజముగ ద్విజుఁడౌ
గట్టిగఁ బఠింప వేదము
పట్టున విప్రుండయగును ♦ బ్రహ్మానందా. 10

తా॥ ప్రతిమానవుఁడును బుట్టఁగానే శూద్రుఁడనఁబడును. నిత్య నైమిత్తికాది కర్మలఁ జేయుటవలన ద్విజుఁడనియును, వేదములు పఠించుటచే విప్రుండనియుఁ జెప్పఁబడును.

చేకొన బ్రహ్మజ్ఞానము
ప్రాకటముగ విప్రుఁడవల • బ్రాహ్మణుఁ డయగున్
లోకమున నట్టివారిని
వాకొన నెవఁడో యొకండు • బ్రహ్మానందా. 11

తా॥ ఆ విప్రుఁడే బ్రహ్మజ్ఞానమును బొందిన బ్రాహ్మణుఁ డనఁబడును. అట్టి బ్రాహ్మణుని గనుదమన్న నెవఁడో యొకఁడు గలఁడు. స్వార్థపరులైన నామకార్థబ్రాహ్మణులీ ప్రపంచమంతట నిండియున్నారు.

కులమాయెను గుణవృత్తుల
బలమున రాజాయెఁ దపము • వలనను బాఱుం
డలకృషి వైశ్యుండగు సే
వల శూద్రుండనఁగ వెలసె • బ్రహ్మానందా. 12

తా॥ గుణ భేదములచేతను వృత్తుల తారతమ్యముచేతను గులము లేర్పడెను. బ్రహ్మజ్ఞానమువలన బ్రాహ్మణుండును, బలమువలన క్షత్రియుఁడును, కృషి యొనర్చుటచేత వైశ్యుఁడును, పైవారికి సహాయుఁడగుటచే శూద్రుండు ననఁబడుదురు.

కులమేది బ్రహ్మవిద్యకుఁ
గులమెయ్యది దివ్యమౌని • కులతిలకులకున్
వెలయుఁగ బిందుకులమె భూ
వలయమునన్ జనులకెల్ల • బ్రహ్మానందా. 13

తా॥ ఎట్టికులమువాఁడైనను బ్రహ్మవిద్యను బడయవచ్చును. వసిష్ఠనారదాదులు నీచకులములందుఁ బుట్టియు బ్రహ్మవిద్య నెఱుంగుటచే బ్రాహ్మణులైరి. సర్వజీవులును శుక్లశోణితముల వలననే పుట్టుటచేత బిందుకులజులే యగుదురు.

మాలలు మాదిగ లంచును
బ్రేలంగానేల వృత్తి ♦ భేదముగాదే?
మేలైన యాత్మకులమును
బాలింపఁడు హీనమతిని ♦ బ్రహ్మానందా. 14

తా। సర్వజనులు నొక్క యాత్మకులమే యని తెలియక, మూఢులు మాలలు మాదిగలని పిలుచుచుందురు. ఈ భేదములు వృత్తులవలననే గలిగెను.

ధర నారీపురుషు లొకటఁ
బరమాత్ముని సృష్టిలోన ♦ పరఁగుటసమమై
గరితల కధికారముదగుఁ
బరమంబగు ధర్మమిదియె ♦ బ్రహ్మానందా. 15

తా॥ స్త్రీ పురుషులొక్క పరమాత్మునివలననే సృష్టింపఁబడుటచేతఁ, బురుషులకు వలెనే స్త్రీలకును సమానాధికారముండుట పరమధర్మమగును:

స్త్రీలకు విద్యాపాటవ
మేలాయని బ్రేలుచుంద్రు ♦ హీనమనస్కుల్

మూలము విద్యకు వాణీ
బాలామణిగాదె జగతి? ♦ బ్రహ్మానందా. 16

తా॥ మానవులు బుద్ధిలేనివారై "స్త్రీలకు విద్యయేల" యని వదరుచుందురు. సకలవిద్యలకు నధిదేవతయైన సరస్వతి స్త్రీయేగదా?

మైత్రేయీ ముఖ్యాణీ
నేత్రలు నిగమాంతవిద్య ♦ నేర్చినవిదుషుల్
సూత్రార్థము లెఱింగిన స
త్పాత్రలు గారె రెవారు ♦ బ్రహ్మానందా. 17

తా॥ మైత్రేయీ మొదలగు స్త్రీలు వేదవేదాంతాది సమస్తవిద్యలను నేర్చి, తద్భావము లెఱుంగుటచేత గొప్పవారయిరి.

కాంతలకు స్వేచ్ఛనొసఁగిన
వంతకు లోనగు గృహంబు ♦ వలదనిమూఢుల్
చింతించి చర్యచెడునని
భ్రాంతిపడుచునుండువారు ♦ బ్రహ్మానందా. 18

తా॥ స్త్రీలకు స్వేచ్ఛనొసఁగిన (స్వతంత్రమిచ్చిన) గృహములు కష్టములపాలగుననియు, వారినడతలు చెడుననియుమూఢులైన వారు భ్రమచెంది కలఁచాటుల నుందురు.

దేశంబునఁగల కొఱఁతల
నాశం బొనరించు విత్త ♦ నము నాటుటకై

ధీశక్తియుక్తకాంతలె
పాశములను ద్రెంచువారు ♦ బ్రహ్మానందా. 19

తా॥ దేశమునందుఁగల విద్య, ధర్మము వృత్తి పొందలగు కోఱికలను, బుద్ధిమంతులైన స్త్రీలే వారిబిడ్డలు పొందలయిన వారికిఁ దెల్పి తీర్చెదరు.

పురుషులకునుబలె స్త్రీలకు
సరిహక్కులు గల్గునేని ♦ సంఘము లందున్
వరగృహలోపము లేగును
బరమానందంబుగల్గు ♦ బ్రహ్మానందా. 20

తా॥పురుషులకు వలె స్త్రీలకును దలిదండ్రులకుఁగల స్థిర చరాస్థులయందును ధర్మ రాజకీయ విద్యాది సర్వ విషయములందును సమానమైన హక్కులం గల్గెనెడల గృహమునందును సంఘములందును దేశమునందును గల్గిన లోపములు నశించును.

పతిసేవ సతికినెట్టులొ
సతిసేవయుఁ బతికినట్లు ♦ సతిపతులకొగిన్
గతు లన్యంబిల లేవని
బతిసతు లెఱుఁగంగవలయు ♦ బ్రహ్మానందా. 21

తా॥ భర్తసేవ భార్యకెట్లు మాన్యమగునో, యట్లే భార్యసేవయు భర్తకు ముఖ్యమగును. ఈ ప్రపంచ ధర్మములందిత రంబెటు మించిన దొక్కటియులేదు

వరశుల్కం బనియెడు నొక
నరకంబును దెచ్చిపెట్టి ♦ నారది వృథగా
ధర నేర్పడి దుఃఖంబుల
భర మొసఁగె గృహంబులందు♦బ్రహ్మానందా.22

తా। లోకమునఁ బెండ్లికుమారునకుఁగట్నములను నొకకష్టమును దెచ్చిపెట్టియున్నారు. ఇదియే నరకమువలె ననేక దుఃఖములను గల్గించుచు గృహములను గూల్చుచున్నది:

వరశుల్కం బొసఁగినచోఁ
బురుషుఁడు బానిసయగాఁడె ♦ పూఁబోఁడికి నీ
ధరనది నీచముకాదే
వరుఁడెఱుఁగఁడు దీనిమదిని ♦ బ్రహ్మానందా.23

తా॥ పెండ్లియందుఁ గట్నమెంత యెక్కువగాఁ గొనిన నంత గౌరవమని తలంచుచున్నారు. అట్లుమ్మడు వోయిన పురుషుఁడు స్త్రీకి బానిస యగుచున్నాఁడు. ఇట్టిబానిసత్వము నీచమని తెలియక మానవుఁడు విఱ్ఱవీగుచున్నాఁడు.

బాలికలకును వివాహము
బాలిశులై చేయుచుంద్రు ♦ పాపమనక యా
కాలమున భర్తయితఁడని
బాలిక యెఱుఁగంగఁగలదె ♦ బ్రహ్మానందా.24

తా॥ మిక్కిలి పసిపాపలగు బాలికలకుఁ బాపమని యైనఁ దలంచక, తలిదండ్రులు మూర్ఖులై పెండ్లిసేయుదురు. ఆ బాల్యావస్థయందా చిన్నది 'యితఁడు నాభర్త' యనియైనను దెలియఁజాలదు.

ఆమెకు నొప్పుగఁ జిరమగు
సౌమాంగల్యంబుగలుగఁ ♦ జాలిన మేలౌ
నామెపతి భువిని వీడిన
భామినిగతి దుర్భరంబు ♦ బ్రహ్మానందా. 25

ఆ బాలిక దీర్ఘసుమంగలిగా నుండిన మేలగు, లేనిచో నామెయొక్క జీవితము భరింపరాని దుఃఖములతో నిండియుండును.

ఆలలన సంతు లేమిని
నేలా వరియింపరాదొ ♦ యితరవరుని మీ
రాలోచింపుఁ డోకించుక
బాలామణి సుఖముకొఱకు ♦ బ్రహ్మానందా. 26

తా॥ అట్లు పతిచనిపోయిన బాలికకు సంతానము లేనియెడల, నామె సుఖముకొఱకు వివాహము చేసికొనఁగోరినయెడల మఱియొకని వివాహమాడినను దోషము లేదు.

ఆపగిదిఁ జేయకుండినఁ
బాపంబులు జనకులకును ♦ బ్రాపించుఁగదా

శాపంబులిడుదు రాత్మను
బాపను నిటు చేసెననుచు ♦ బ్రహ్మానందా. 27

తా॥ అట్లాబాలికకు మరల వివాహము చేయనియెడల దలిదండ్రులకుఁ బాపము గలుగుటయేకాక, యారా! దురాత్ములగు తలిదండ్రులెంత చేసిరని యాబాలిక శపించి విలపించుచుండును. [అట్లుచేయకుండిన దుష్టవర్తనలై యపకీర్తిఁదెత్తురు]

బాలవితంతులకును బుధు
లోలినిఁ బెండ్లిండ్లుసేతు ♦ రుర్విని సరిగా
దీలీలన ముగ్ధయయిన
బాలికకే పెండ్లివలను ♦ బ్రహ్మానందా. 28

తా॥ కొందఱు బాలవితంతువివాహము సేయరాదని చెప్పెదరు. అట్లయిన బాల్యవివాహములు చేయుటయేతప్పగును. [కన్యకు 16 ఏండ్లలోపల బ్రహ్మచారికి 25 ఏండ్లలోపలఁ బెండ్లి సేయరాదు]

వరుఁడేగఁ బుస్తెపూసల
సరిదీయఁగ బోడిసేయఁ ♦ జనదామెకు ము
న్నిరవుగఁ దాల్చిన వస్తులఁ
బరమంబుగఁ దాల్పనగును ♦ బ్రహ్మానందా. 29

తా॥ భర్తచనిపోయి నపుడు స్త్రీకి ఆభర్తకట్టిన పుస్తెపూసలు తీయవలెను. బాల్యాదినుండి ధరించుచువచ్చిన

యలంకారములను దీయరాదు. ఆమెనుదలఁగొఱిగించి యవమానపఱచరాదు.

చదివితిమని యెద రల్పులు
పదపడి సంస్కర్తలమని ♦ భావించెదరా
యదనైన వెనుకఁ బడుదురు
వదలుచును మనోబలంబు ♦ బ్రహ్మానందా. 30

తా॥ అల్పులైనవారు మేము బాగుగాఁ జదివితిమనియు గొప్పసంస్కర్తలమనియు భావించుటే కాక సభాస్థలంబుల గొప్ప యుపన్యాసములను గూడఁ జేయుదురు. సమయము వచ్చినపుడు మనోబలము లేనివారై, స్వసంఘమునకు వెఱచి మా తలిదండ్రులీ పద్ధతులంగీకరింపలేదని సాకులు చెప్పి యధర్మమైనను బూర్వపద్ధతులనే యవలంబింతురు.

ఇంచుక లాభంబునకై
కించిజ్జ్ఞుఁడు దేశమునకుఁ ♦ గీడొనరించుఁ
గొంచక సర్వజ్ఞుండు ప్ర
పంచమునకు మేలుఁగూర్చు ♦ బ్రహ్మానందా. 31

అల్పుఁడు తనలాభమునకై లోకమునకుఁ గీడు సేయును. గొప్పవాఁడు స్వార్థత్యాగియై యెట్టిసమయము లందైనను లోకమునకు మేలు సేయును.

మన దేశపువృత్తుల నె
ల్లను బోషణ సేయ లెస్స • లలితంపుఁ గృషియుం
ఘనవృత్తిగాఁ గృషికుఁడు
పనివడిఁ జేయంగఁ దగును • బ్రహ్మానందా. 32

తా॥ ప్రతిమానవుఁడును నాయాదేశమునందలి వృత్తుల నభివృద్ధికిఁ దేవలయును. సర్వవృత్తులకు నాధారమగు వ్యవసాయమును రైతు విడువక సేయవలయును.

అన్యాసీతము లగునవి
మాన్యులు గ్రహియింపరన్య • మానవులింకం
ధన్యము లంచును గొనియెద
రన్యములగు వస్తుచయము • బ్రహ్మానందా. 33

తా॥ ఇతర దేశములందుండి తేఁబడిన వస్తువులను దేశాభిమానముగల బుద్ధిమంతులు గ్రహింపరు. దేశాభిమానము లేని స్వార్థపరులు స్వదేశ వస్తువులను వీడి యన్యదేశవస్తువుల నభిమానముతో గ్రహించెదరు.

ముద్దుగ మన దేశంబున
ఖద్దరు గలుగంగ విదేశ • ఖచితాంబరముల్
పద్దుగఁ దాల్తురు కుమతులు
రద్దుసుమీ వారిమాట • బ్రహ్మానందా. 34

తా॥ మనభారత దేశమందుత్పన్నమైన ప్రత్తినివడకి యా హాలువలనఁ నేయఁబడిన (ఖద్దరు) వస్త్రములను దాల్చుటమాని, స్వల్పసుఖమును గోరు బుద్ధిహీనులు, విదేశవస్త్రముల ధరించుచున్నారు.

మనవారివలన న్యాయ భ
వనములు మిక్కిలిగఁ బెంపఁ ♦ బడియెనుగాదే
ఘనులగు వారల నేర్పరఁ
బనిచిన న్యాయములుగలుగదె ♦ బ్రహ్మానందా. 35

తా॥ మనభారతదేశములో నీర్ష్యాసూయలవలన వ్యవహారములు తగవులు నెక్కువగుట చేతనే న్యాయస్థలములెక్కువై విశేషధనవ్యయ మగుచున్నది. అట్లుగాక ప్రతిగ్రామమునందును పంచాయతుల నుంచుకొనివారిద్వారా తగవులను బరిష్కరించుకొనుట మేలగును.

ఏయాశ్రమమున్నదైనను
మాయను విడిపించునట్టి ♦ మార్గమెఱుఁగు నా
ధీయుక్తుఁడు ముక్తుండగుఁ
బాయక విజ్ఞాననిష్ఠ ♦ బ్రహ్మానందా. 36

తా॥ బ్రహ్మచారి గృహస్థు వానప్రస్థు సన్యాసి వీరిలో నెవరైనను విజ్ఞానయుక్తుఁడై మాయను విడిపించెడు మార్గము

గురుబోధ యనెడు కొడవలి
నురుతర మాయాలవలిని ♦ నోలిం గెడపన్
దిరమగు బ్రహ్మమె నిలుచును
పరమెద్దియు నిల్వఁబోదు ♦ బ్రహ్మానందా. 37

తా॥ గురుబోధయను కొడవలిచేత మాయయను తీఁగెను దెగఁగొట్టినయెడలఁ బరబ్రహ్మ మొక్కటియె నిలుచును. దీనికంటె నన్యమేదియుం నిలువదు.

దేవుఁడు వ్యాపకుఁ డనుచును
భావింపఁగ విగ్రహములు ♦ పామరులకఁటం
చా విప్రులె పామరులయి
వావిరిఁ బూజింత్రువాని ♦ బ్రహ్మానందా. 38

తా॥ దేవుఁడు సర్వవ్యాపకుఁడనియుం, నతని మూఢు లెఱుంగఁజాలరుగాన వారికొఱకు దేవాలయములు గట్టించి విగ్రహములు ప్రతిష్ఠింపఁబడెననియుఁ జెప్పుచు నామూఢులను వారి నందుఁ జొరనీక యావిప్రులే మూఢులయి దేవాలయములను బూజించెదరు.

పతితులము మమ్ముఁ బ్రోవఁగ
క్షితిఁ బుట్టినబ్రహ్మవేత్త ♦ చిత్సుఖమీయా
కృతిసాకార బ్రహ్మము
వ్రతముగదా సేవసేయ ♦ బ్రహ్మానందా. 39

పూర్వకముగా దర్పణభావంబును నెఱింగించి, యీత్రివిధ దీక్షల కలితంబయిన పూర్ణభావమును దెల్పిన మహానుభావులరు.

గురుఁడే బ్రహ్మయు విష్ణువు
గురుఁడే యామీశ్వరుండు ♦ గురుఁడేసాక్షాత్
పరుఁడగు బ్రహ్మం బనఁబడు
వరగురునకు సాటిలేదు ♦ బ్రహ్మానందా. 44

తా॥ గురువే భక్తుల హృదయకమలములందు జ్ఞానాంకురములు గలిగించుటచే బ్రహ్మయనియు, బోధయను జలములచే జ్ఞాన వృక్షమును బోషించుట వలన విష్ణువనియు, ననాదిగాఁ వచ్చిన యజ్ఞానముఁబోఁగొట్టుటచే నీశ్వరుఁడనియుఁ జెప్పఁబడును. ఆ నిరాకారబ్రహ్మమే సాకారరూప మగు గురుమూర్తిగా వచ్చి నన్ను రక్షించెను గనుక నాతనికి సమాను లెవ్వరును లేరు

ఆనఁగఁ బ్రాణాయామము
మానుగఁ దెలిపించినారు ♦ మాన్యచరిత్రా
స్థానములను నష్టాక్షరి
పానముచేయించినారు ♦ బ్రహ్మానందా. 45

తా॥ ఓగురుదేవా! మాకు అష్టాక్షరీ మంత్రమును, వాని స్థానములను, ప్రాణాయామమును దెలిపితిరి.

భవనాశ ఓంకృతినమ
శ్శివాయ ధంరామటంచు ♦ సెలవిచ్చితిరా

స్తవనీయుల నధిపతులను
భవదూరా! తెలిపితిరిగ ♦ బ్రహ్మానందా. 46

తా॥ జన్మరహితుఁడవగు నో సద్గురుస్వామీ! ఓం నమ శ్శివాయధంరామను అష్టాక్షరీ మంత్రమును వాని స్థానములను వాని యధిదేవతలను దెలిపి మాసంసారబంధములను దొలఁగించితిరి.

విశే॥ బీజ స్థానాధిదేవతలు: గణపతియధిదేవతగాఁగల యాధారమునందలి ఓంకారంబును,

బ్రహ్మయధిదేవతగాఁగల స్వాధిష్ఠానమందలి నకారంబును,
విష్ణువధిదేవతగాఁగల మణిపూరకమునందలి మకారంబును,
శివుఁడధిదేవతగాఁగల అనాహతమునందలి శికారంబును
జీవుఁడధిదేవతగాఁగల వాకారంబును,
ఈశ్వరుం డధిదేవతగాఁగల ఆజ్ఞేయము నందలి యకారంబును,
శక్తియధిదేవతగాఁగల కర్ణాంతరమందలి ధంకారమును,
గురుఁడధిదేవతగాఁగల సహస్రారమందలి రాంబీజము నగును.

జగముల జననస్థితియును
దగువిధమునఁ దెల్పిమాకుఁ ♦ దదతీతంబౌ
గగనాతీతముఁ దెల్పిన
భగవంతా సుగుణశాంత ♦ బ్రహ్మానందా. 47

తా॥ జగత్తుయొక్క యుత్పత్తిని దెలిపి, పిదప దాని కతీతంబగు పరిపూర్ణాచల భావంబును సూచించిన భగవత్స్వరూపుఁడవగు నో గురుమూర్తీ! నీకు నమస్కారము.

పరిపూర్ణంబున మూలం
బరయంగా లేక సచ్చి • దానందమదా
నురహింంచెను దానఁ బ్రకృతి
పరఁగెను గుణసామ్యమగుచు • బ్రహ్మానందా.

తా॥ సర్వవ్యాపకమైన పరిపూర్ణబ్రహ్మమునందు మూలము లేకయే, తన భ్రాంతివలన సచ్చిదానందబ్రహ్మము తనకుఁ దానే తోఁచెను. దానియందు సత్వరజస్తమోగుణసామ్యమును బొందిన మూలప్రకృతి బ్రహ్మమునకు వేఱుగాక యాబ్రహ్మమునందే గలదు.

ఆప్రకృతిని సత్వాంశం
బై పరమేశ్వరుఁడు మలిన • మై జీవుండా
నాపగిది జగముఁ దనువులు
బ్రాపించెను దామసమున • బ్రహ్మానందా. 49

తా॥ ప్రకృతియందు విజృంభించిన సత్వగుణమే మాయయనంబడును: ఈ మాయతోఁగూడిన బ్రహ్మమే యీశ్వరుఁడనఁబడును. ఈసత్వగుణమున రజస్తమోగుణములు గూడిన మలినసత్వమనఁబడును: ఇదియే యవిద్య యనంబడు. ఈయవిద్యతోఁగూడిన బ్రహ్మచైతన్యమే జీవుండగును. మలినసత్వభేదములవలన జీవులును భిన్నులగుదురు. ఈజీవులయొక్క కర్మఫలభోగార్థమై పరమేశ్వరుండు తమోగుణమును వీక్షించి ఆకాశాది పంచభూతములను సృజించెను. వానివలన సర్వజగములును, ఆ జగములలోఁగల జీవులయొక్క స్థూలసూక్ష్మశరీరములను సృజించెను.

నయముగ వ్యష్టి శరీర
త్రయబుద్ధి వదలి సమష్టి ♦ తన్వభిమానుం
డయి యీశ్వరుఁడన నగు భవ
భయహార విజ్ఞానవేద్య ♦ బ్రహ్మానందా. 50

తా॥ వ్యష్టిరూప స్థూల సూక్ష్మ కారణ శరీరములు నేనను కించిజ్జత్వమునువీడి, సమష్టిరూపమగు బ్రహ్మమే తానను సర్వజ్ఞత్వముగల జీవుఁడే యీశ్వరుఁడనఁబడు.

జీవుండన నీశ్వరుఁడనఁ
గావెలసిన చిజ్జడాత్మ ♦ కంబగు బ్రహ్మం
బీవిశ్వమూల మది భ్రమ
వావిరిఁ బూర్ణంబెనిలిచె ♦ బ్రహ్మానందా. 51

తా॥ జీవేశ్వరులుగాఁ దోఁచిన యీచిజ్జడాత్మకమైన సచ్చిదానంద బ్రహ్మమే యీవిశ్వమునకు మూలము. ఇదియే భ్రమ. పరిపూర్ణమెల్లప్పుడు స్వతస్సిద్ధమైనది.

మొదటను సాంఖ్యముఁ జక్కఁగ
మది నాటించితిరి మీకు ♦ మహిమెట్టిదాకో
ముదమున షట్చక్రంబుల
పదమెఱిఁగించితిరి మాకు ♦ బ్రహ్మానందా. 52

తా॥ మొదట సాంఖ్యభావమును మామనస్సునకు బోధపడునట్లు తెలిపి, తరువాత (ఆధార. స్వాధిష్ఠాన, మణిపూరక,

అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయములను) షట్చక్రముల వివరముగాఁ దెలిపితిరి.

యమనియమాదుల మదికిని
విమలత్వముఁ గూర్చుకొఱకు ♦ వినిపింపుచు నో
యమలానందాత్మక మా
భ్రమలను దొలఁగించినారు ♦ బ్రహ్మానందా. 53

తా॥ మా మనస్సులకు నిర్మలత్వము కలిగించుకొఱకు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన ధారణ, సమాధియను అష్టాంగయోగములఁ దెలిపి మా భ్రమను దొలఁగించినారు.

విశే:— యమమనఁగా: అహింసా, సత్య, మస్తేయ, బ్రహ్మచర్యాపరిగ్రహములు

నియమ మనఁగా: శౌచ, సంతోష, తప, స్వాధ్యాయేశ్వర ప్రణిధానములు

ఆసన మనఁగా: సిద్ధాసన, పద్మాసన, సింహాసన, భద్రాసన, స్వస్తికాసనాదులు

ప్రాణాయామమనఁగా: లోపలికి వెలుపలికి సంచరించు వాయువు నడ్డగించుట. ఇందు రేచక పూరక కుంభకములనఁ ద్రివిధంబులు గలవు. వీనిగురుముఖంబునం దెలియందగు)

ప్రత్యాహారమనఁగా:— చిత్తేంద్రియములు వానివాని వృత్తులనుండి మరలి యాత్మయందు వర్తించుట.

ధ్యానమనఁగా:— మనసు విషయ చింతలనువీడి ధ్యేయ స్వరూపమయిన బ్రహ్మమునే చింతించుట.

ధారణమనఁగా:— ఆత్మ ధ్యానంబునుమనంబున నిలుపుట.

సమాధియనఁగా:-ధ్యానించువాఁడు ధ్యానము, ధ్యానింపఁబడిన వస్తురూపమును బొందుట.

ధర నోం హ్రీం శ్రీం హం సం
బరయఁగ నాధార హృదయ♦మందును భ్రూమ
ధ్యరవీందు స్థానంబులఁ
బరఁగును బంచాక్షరములు ♦ బ్రహ్మానందా.54

ఆధారచక్రమందలి ఓంకారమును, అనాహతమునందలి హ్రీంకారమును, ఆజ్ఞేయమునందలి శ్రీంకారమును సూర్యచంద్రుల యందలి హంసమ్ములను జేరి హంసపంచాక్షరియాయెను.

తారకమంత్రము సక్రమ
మారఁగఁ దెలిపించి యదియె♦యఖిలముముక్షుల్
గూరిమి నెఱుఁగం దగునని
వారక బోధించినారు ♦ బ్రహ్మానందా. 55

తా॥ మోక్షాపేక్షగలవారు తారకమంత్రము సక్రమముగా నెఱుఁగందగునని బోధించినారు.

ఊహింపఁగ సత్కృప బ్ర
హ్మాహంబను సూక్తిమాకు ♦ నవరోహణమా
రోహణయుతసోహమె సూ
వ్యాహృతియని తెల్పినారు ♦ బ్రహ్మానందా.

తా॥ నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేనను సూత్రము మాకుఁదెలుపుకొఱకుఁ బూరక రేచకములందు సోహమను నక్షరద్వయమునుగూర్చి జపింపవలయునని తెలిపితిరి.

వెలుపల వచ్చిన నేనని
తలఁగక లోనేగ బ్రహ్మ ♦ తత్త్వం బనుచుఁ
వెలయ జపించును జీవుఁడు
వలను దెలుపు గురువరేణ్య ♦ బ్రహ్మానందా.

తా॥ రేచకమున నేను అను అర్థముగలయక్షరమును, బూరకమున 'బ్రహ్మ' తత్త్వబోధకమగు నక్షరమును గూర్చి జీవుఁడు జపించుచుండునని బోధించినారు.

ఒక విఘడియ కార్మాఱులు
సకల జగంబులును నోగిని ♦ సంచారంబుఁ
వికలంబు లేక హంసుఁడు
ప్రకటితముగఁ జేయుఁగాదె ♦ బ్రహ్మానందా. 58

తా॥ ఈ హంస ఒక విఘడియకు ఆఱుమాఱులు లోపలికి వెలుపలికి సంచరించును.

కామాది శత్రు లార్వురు
సామాన్యులుగారు వారి ♦ సమయింపంగా
భూమిని దుస్తర మాత్మా
రామధ్యానంబు గూల్చు ♦ బ్రహ్మానందా. 59

తా॥ కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములను నంతశ్శత్రువులేవిధమునను గూల్పఁబడవు ఈ తారకధ్యానము వలననే యవి కూల్పఁబడుదురు.

అంతర తారకమను నొక
వింతగొలుపు విద్య చెవులు ♦ విందొనరంగా
సాంతంబుగఁ దెల్పిన భగ
వంతా సుగుణప్రశాంత ♦ బ్రహ్మానందా. 60

తా॥ ఆపోజ్యోతియందుండి యుత్పన్నమై యాధారాదులనాటింటి వ్యాపించి, పంచప్రాణములను ధరించి, సకల కర్మలను జేయుటకు శక్తినిచ్చు క్రియాశక్తిమార్గమగు నంతర తారకమును బోధించితిరి.

ఇలనాపోజ్యోతినిఁ గల
బలుశక్తియె ప్రాణముఖ్య ♦ వాయుల వాగా
దులఁ గూడి సేయు నా క
ర్మలను గ్రియాశక్తి యిదియె ♦ బ్రహ్మానందా.

తా॥ ఆపోజ్యోతిని గలశక్తియే ప్రాణాది వాయువులనుగూడి కర్మేంద్రియములద్వారా కర్మలను జేయుటచేతం గ్రియాశక్తి యనఁబడును.

ఈ యాత్మశక్తిజ్ఞాతను
నాయతముగఁ గూడి శ్రోత్ర♦మాదులద్వారా

యాయావిషయము లెఱుఁగుటె
పాయకయగు జ్ఞానశక్తి ♦ బ్రహ్మానందా. 62

తా॥ ఈ యాత్మశక్తియే యంతఃకరణమును గూడి జ్ఞానేంద్రియములద్వారా యాయా విషయముల నెఱుఁగుటచే జ్ఞానశక్తి యనఁబడును.

ఈయంతఃకరణంబును
వాయువులను గూడినట్టి ♦ వరశక్తియుతం
బై యంతర తారకమును
బాయక తాఁబొందు నిజము ♦ బ్రహ్మానందా.

తా॥ అంతఃకరణమును వాయువులను గూడినట్టియాత్మ శక్తిని దెలిసినవారే యంతర తారకమును నెఱిఁగినవారగుదురు.

జగతిని నింద్రియ కారణ
మగు శక్తిని బొంది దాని ♦ మార్గము ననునిం
పగు నాపోజ్యోతిఁ గనబ
రగు నది జ్ఞానంబనంగ ♦ బ్రహ్మానందా. 64

తా॥ సర్వేంద్రియములతోఁగూడు నీ యాత్మశక్తిని బొంది, దాని మార్గమున నాపోజ్యోతిని గనందగు. ఇదియే జ్ఞాన మార్గము.

ఈరీరు నిగమ వాక్యము
లారయ నొందింప నిదియ ♦ యదననిమదికిఁ

చేరిచినారలు మీ రిం
పారఁగఁ దారకమునందు ♦ బ్రహ్మానందా. 65

తా॥ నాలుగు వేదములయందలి మహావాక్యముల యర్థములను దెలియఁజేయు తారకభావమును నామదికి నాటు నట్లు బోధించితిరి.

ప్రజ్ఞానమె బ్రహ్మంబను
విజ్ఞానముగలుగఁ జేసి ♦ విపులమతిని నా
యజ్ఞానముఁబోఁగొట్టిన
ప్రజ్ఞానానందరూప ♦ బ్రహ్మానందా. 66

తా॥ "ప్రజ్ఞాఁబ్రహ్మ" యను ఋగ్వేద మహావాక్యమును దెలియఁజేసి నాయజ్ఞానమును బోఁగొట్టితిరి.

విశే:-ఏచైతన్య మంతఃకరణములతోఁ గూడి జ్ఞానేంద్రియముల ద్వారా విషయములను గ్రహించుచున్నదో, యేది ప్రాణాదివాయువుల ధరించి కర్మేంద్రియములద్వారా కర్మలఁ జేయుచున్నదో యాచైతన్యమే 'ప్రజ్ఞాన' మనఁబడును.

ఈచైతన్యమే దేవ మనుష్య తిర్యగాది సకల శరీరముల యందు సంపూర్ణమై యుండుటచేత 'బ్రహ్మ' మనఁబడును.

అదియె యహంబ్రహ్మాస్మియ
నుదివ్య మంత్రమని తెలిపి ♦ న్యూనరహిత మహా
సదమల మగు నానందంపుఁ
బదవిని బొందించినారు ♦ బ్రహ్మానందా. 67

తా॥ "అహం బ్రహ్మాస్మి" యను యజుర్వేద మహా మంత్రమును దెలిపి, యానందమును బొందించితిరి.

విశే - అధికారియైన పురుషునియొక్క బుద్ధియందు సాక్షియై ప్రకాశించు ప్రత్యగాత్మయే "అహం" శబ్దమగును. దేశకాలవస్తుపరిచ్ఛేదములులేక యెందును నిండియుండు నీ యాత్మయే 'బ్రహ్మ' మనంబడును.

ఈ ప్రత్యక్ చైతన్యమును బ్రహ్మ చైతన్యమును నొక్కటియగుటచే 'అస్మి' యని చెప్పఁబడును.

అటు లేతత్త్వమసియనెడు
పటుతరవాక్యార్థమెఱుక ♦ పఱచిజనన సం
కటములుదీర్పవె మాకు
ఘటకల్గఁగ బోధఁజేసి ♦ బ్రహ్మానందా. 68

తా॥ "తత్త్వమసి" యను సామవేద మహావాక్యమును బోధించి మా జన్మసంకటములను బోఁగొట్టితిరి.

విశే.- ఏ సద్వస్తువు సృష్టికి ముందును వెనుకను నామ రూప క్రియరహితమై, సజాతీయవిజాతీయ స్వగత భేదశూన్యమై యున్నదోయదియే 'తత్పదము'

దేహేంద్రియాదులకు విలక్షణమును, మూడవస్థలకు సాక్షియునగు సద్వస్తువే త్వం పదలక్ష్యార్థమగును.

సృష్ట్యాది మధ్యాంతములయందుఁగల సద్రూపబ్రహ్మమే శరీరత్రయవిలక్షణమైన సద్రూపమని తెలియుటే 'అసిపద' మగును

అయమాత్మా బ్రహ్మంబను
నియమ మెఱుక చేసి దాని♦నిర్గుణమనుచున్
నయవాక్యంబుల మా భవ
భయమును బోఁగొట్టినారు♦బ్రహ్మానందా. 69

తా॥ 'అయమాత్మాబ్రహ్మ' మను అథర్వణవేద మహా మంత్రమును దానియర్థమైన నిర్గుణతత్త్వమును దెలిపి, మా జన్మ భయమును బోఁగొట్టితిరి.

విశే - తనకుఁదాఁ బ్రకాశింపుచు, నపరోక్షసాక్షియైన యీప్రత్యగాత్మయే 'అయమాత్మ' యనుశబ్దమున కర్థమగును.

సర్వజగదధిష్ఠానమై,విచారణచేసిశోధింపఁబడఁగాశేషించి యుండు సచ్చిదానందస్వరూపమే బ్రహ్మమనఁబడును.

సర్వంబు బ్రహ్మ మయమని
నిర్వాణుని ముకురమందు ♦ నిలిపిగనఁగనా
శర్వుని జూపించితి రా
పర్వమునను బూజనీయ ♦ బ్రహ్మానందా. 70

తా॥ బ్రహ్మ మంతట నిండియున్నదని యాపోజ్యోతిని దెలియఁజేయుటకు దర్పణభావము నెఱింగించితిరి.

లోకాధారుం డితఁడని
లోకాతీతుండు నితఁడె ♦ లో నెఱుఁగు మటం
చాకాశ రూపుఁ జూపిన
పాకారి ముఖామరనుత ♦ బ్రహ్మానందా. 71

తా॥ ఈయాపోజ్యోతియే సర్వజగత్తునకు నాధారుఁ డనియు నతీతుఁడనియుఁ దెలిపితిరి.

ఆతఁడె. జగములతోడను
నాతతముగఁ దోఁచి యొక్కయదనున లీనం
బౌ తత్త్వమె తానని మా
పాతకములఁ దొలఁచినారు బ్రహ్మానందా.72

తా॥ ఈ యాపోజ్యోతియే సకల జగములతోడను నొకొ్కకపరిఁ దోఁచుచు, నొకొ్కకపరి మటుమాయమగుచు నుండునని తెలిపి, మా పాపములఁ బోఁగొట్టితిరి.

ఈయాత్మఁడె సకలాత్మం
డైయఖిలము తానుగాఁగ వ్యాపించెనఁటం
చాయత మతిఁ దెల్పవె సదు
పాయంబున గురువరేణ్య బ్రహ్మానందా 73

తా॥ ఈ యాత్మయే పిపీలికము మొదలు బ్రహ్మపర్యంతము గాఁగల జీవరాసులయందు వ్యాపించియున్నదని బోధించితిరి.

ఒక్కఁడె సూర్యుఁడు ఘటముల
నెక్కరణిని వేఱువేఱ నీక్షణములకుఁ
దక్కక తోఁచెనొ కనుమా
ఫక్కిని నాత్మందు తోఁచు బ్రహ్మానందా. 74

తా॥ ఒక్కసూర్యుడే యనేకములగు కుండలయందుఁ దోఁచినరీతి, నొక్కపరమాత్మయే యెల్లశరీరములయందుఁ బ్రతిఫలించియుండునని తెలిపితిని.

ముదమార రవిచ్ఛవిఁ దమ
కొదవిన కార్యములవిడిచి♦యుందురె ప్రాణుల్?
మది మొదలగు నింద్రియములు
వదలక పనిసేయునట్లె ♦ బ్రహ్మానందా. 75

తా॥ సూర్యుని ప్రకాశమునుగొని సకలప్రాణులు వాని వాని పనులను జేయునట్టు, లాత్మసత్తానుగొని సర్వేంద్రియములు వానివాని కార్యములఁ జేయునని తెలిపితిని.

వినుఁడొక బ్రహ్మము గలిగిన
వెనుకనె తజ్జనితమాయ♦ వెడలెనుదానన్
గొనకొని సకలము పుట్టెను
బనిపడి మూలంబితండు ♦ బ్రహ్మానందా. 76

తా॥ చిజ్జడాత్మకమగు బ్రహ్మమునందే మాయగల్గెను: దానివలన సకలముపుట్టెను. ఈబ్రహ్మమే యన్నిఁటికిమూలము

జగములు నాతని వలననె
యగపడె నాతండె సచ్చి ♦ దానందుఁడనన్
దగుసృష్టి స్థితిలయకర
భగవంతుండనఁగ నొప్పు ♦ బ్రహ్మానందా 77

తా॥ ఈబ్రహ్మమువలననే సర్వజగములు గల్గెను. ఇతఁడే సచ్చిదానందుఁ డనఁబడును. ఇతఁడే సృష్టిస్థితిలయకారణుఁడైన భగవంతుఁ డనఁబడును.

ధారుణి నీ బ్రహ్మంబే
కారణ కార్యంబులకును ♦ కర్తయనమహా
కారణ రూపుండగుచును
బారంబును నిండియుండు ♦ బ్రహ్మానందా 78

తా॥ ఈబ్రహ్మమే సర్వకారణకార్యములకును కర్తయైన మహాకారణ స్వరూపుఁడై దిగంతములవఱకు వ్యాపించి నిండియుండును.

ఇదిగుర్తెఱుఁగు శరీరము
గద దానిఁ విడఁగజేసి ♦ గర్వంబసి స
మ్మోదమునను బూర్ణభావము
వదలక సూచించినారు ♦ బ్రహ్మానందా. 79

తా॥ ఈసచ్చిదానంద బ్రహ్మమే గుర్తెఱుఁగు నాలవ రీరము.ఇదినింద్యమని దీనివిడిపించిపూర్ణభావమును శాజ్ఞఁజేసితిరి,

పదిరెండన నేమోయని
మదిలోపల నెంచవలదు ♦ మాయాతీతం
బదిబట్ట బయలు పూర్ణము
పదపడిగ్రహియింపవలయు♦బ్రహ్మానందా. 80

తా॥ ద్వాదశాక్షరియనఁగా నేమోయని తలంచవలదు. అది మాయకు నతీతంబై, శుద్ధమై, నిర్భయమై యంతట నిండియుండునదని గ్రహింపవలెను.

పది రెండక్షరములచే
విదితంబగుఁ బూర్ణమెందు ♦ విజ్ఞానయుతం
బదియని మాయను దెలుపును
బదియును నాఅక్షరములు ♦ బ్రహ్మానందా 81

తా॥ ద్వాదశాక్షరీమహామంత్రముచేతఁ బరిపూర్ణము తెలియంబడును. షోడశాక్షరీ మంత్రము చిజ్జడాత్మకమైన మాయను దెల్పును.

అది యేమి లేదు పొమ్మని
వదలక బ్రహ్మంబుఁ దెల్పుఁ ♦ బర్యాయముగా
నిది మొదలే లేనిదనుచు
వదరునుగద మీఁదుమహిమ ♦ బ్రహ్మానందా 82

తా. ఆద్వాదశాక్షరీమంత్రము బ్రహ్మమేమియులేనిదని తెలుపును. షోడశాక్షరీమంత్రము మాయకు మూలము లేదని తెలియఁ బఱచును

అదియును మాయారూపం
బదియుండఁగ జగములుండు ♦ నన్నియునుండుఁ
సదమల సద్గురు కృప నీ
పదియాఱింటిఁ నెఱిఁగివిడుము ♦ బ్రహ్మానందా 83

తా. ఆమాయయుండుటంబట్టి జగములన్నియు నుండును. శ్రీసద్గురుకరుణవలన షోడశాక్షరీభావము నెఱిఁగి యామాయాభ్రాంతిని విడువ వలయును.

కలలోఁ దోఁచిన విశ్వము
మెలఁకువ లేనట్లు మాయ ♦ మెలఁకువఁగనఁడా
దొలఁగును మూఢైదులుగా
బలుకంబడు నుపమయిదియు ♦ బ్రహ్మానందా 84

తా. కలయందుఁదోఁచిన ప్రపంచము మెలఁకువ నెట్లు లేకపోవునో, యట్లే యీమాయపూర్ణస్వాజ్ఞచేఁ దొలఁగిపోవును. ఇందుకుఁ బంచదశాక్షరియే యుపమయనంబడు.

అనెదరు కొందఱు శూన్యం
బని యంతట నిండియుండు ♦ నట్టిదిశూన్యం
బన నెట్లుచెల్లుఁ బూర్ణం
బను నొప్పున నింద్యమగుచు ♦ బ్రహ్మానందా 85

తా. కొందఱు పరిపూర్ణమును శూన్యమనియెదరు పరిపూర్ణము శూన్యమెట్లగును? అది యెన్నఁడు శూన్యము కానేరదు.

అందిందు నెందు బయలే
సందేమియు లేక యుండు సంపూర్ణంబై
యందునఁ బుట్టదు, స్వప్నం
బందున వలె, మాయ యెపుడు ♦ బ్రహ్మానందా.

తా. ఈ బయలెందుఁ జూచిన సందులేక సంపూర్ణంబై యుండును. స్వప్నమునందు ప్రపంచము తోఁచియుఁ

బుట్టిన చందమున, నీపరిపూర్ణమునందు మాయ యెన్నఁడును బుట్టలేదు.

ఈకనఁబడు బయలేయని
ప్రాకృతులనుచుంద్రు గురుని ♦ పద మెఱుఁగకయీ
లోకము లెంచినఁ బూర్ణము
ప్రాకటముగఁ గానఁబడదు ♦ బ్రహ్మానందా. 87

తా. ఈకనుపించు భూతాకాశమే పరిపూర్ణమని గురుపద మెఱుఁగని పామరులు భావింతురు. ఈలోకభ్రాంతిగలవారికి పరిపూర్ణ మెన్నఁటికిఁ దెలియఁబడదు.

వెలిబయలు నకన్యము లో
పలి బయలగుదాని కవలఁ ♦ బరబయలౌనా
వెలిలో పరములమీఱిన
వలనగు నిర్భయ మెసుమ్మి ♦ బ్రహ్మానందా. 88

తా. వెలిబయలనఁగా భూతాకాశము, దానికి లోపలయిన లోబయలే చిత్తాకాశము. ఈరెంటికవలిదైన పరబయలే చిదాకాశము. ఈ మూఁటిని నతిక్రమించిన నిర్భయమే పరిపూర్ణమనఁబడును.

విను మంతఃకరణంబుల
కును మూలంబైన జ్ఞాత ♦ గూలెను మున్నే
ఘనతరమగు తోఁపకములు
పనివడి యెన్నండు లేవు ♦ బ్రహ్మానందా. 89

తా. అంతఃకరణ చతుష్టయమునకు మూలమైన జ్ఞాత యెప్పుడు నశించెనో, యప్పుడే యాజ్ఞాతవలనఁ దోఁచఁబడిన సకలప్రపంచమును లేకపోయెను.

సకలంబును నీయందే
ప్రకటీకృతమాయె నీవె • భ్రమ నీవేగా
సకలము నీతోఁ బోవును
బ్రకటముగా నేమిలేదు • బ్రహ్మానందా. 90

తా. ఎఱుకరూపుఁడవగు నీయందే యీసర్వప్రపంచము తోఁచెను. ఆపరిపూర్ణమునందు నీ వెప్పుడు లేకపోతివో యప్పుడే యీ సర్వప్రపంచము నీతో లేకపోవును. పిదప నేమియులేదు.

ఆధారము లేదెందున
నాధేయము దానఁబోయె • నద్వయముడిగెన్
బోధాంతము వేదాంతము
బాధాంతము పూర్ణమెన్న • బ్రహ్మానందా. 91

తా. ఈమాయకు నాధార మెచటను లేదు. కావున నాధేయమును లేదు. రెండును లేనపుడు అద్వైతము లేకపోయెను. ఇది బోధకు, వేదమునకు, జననాది బాధలకు నంత్యమైన పరిపూర్ణముగా తెలియవలెను.

సాకారంబని మఱియు ని
రాకారంబనుచు నూరు • లందరు బ్రహ్మం

బాకారమె? యదిశుద్ధని
రాకారము పూర్ణమరయ • బ్రహ్మానందా. 92

తా. కొందఱు బ్రహ్మము సాకారమనియు, కొందఱు నిరాకారమనియు నందురు. అదియెన్నఁడును సాకారనిరాకారములఁ బొందక శుద్ధనిరాకారమై నిండియున్నది.

ఉన్నది లేదను సందియ
మెన్నఁడుఁ గలుగంగఁదగునె • యిద్ధజనులకున్
సన్నని సందియ మున్నను
బన్నగ నామాయ దెగదు • బ్రహ్మానందా 93

తా. బుద్ధిమంతులైనవారికిఁ బరిపూర్ణమున్నది లేదను సందియము గలుగరాదు. ఇంచుక సంశయము గలిగినను మాయాభ్రాంతులు విడవవు.

కలలోఁ దోఁచిన వస్తువు
మెలఁకువలో నెట్లులేదొ • మేలుగనట్లే
యిలఁదోఁచె బ్రహ్మమందున
వలపించుట కేమిలేదు • బ్రహ్మానందా. 94

తా. కలలోఁ దోఁచిన ప్రపంచము మెలఁకువగనిన నెట్లు లేకపోయినదో యట్లే యీపరిపూర్ణమునందు లేకయే తోఁచిన ప్రపంచముసత్యమను భ్రాంతిపొందుట కేమియులేదు.

గురుమూర్తికరుణఁ బూర్ణం
బరసి వెనుక నెఱిఁగినట్టి • యాగుర్తువిడక్

విరమించు మాయ యచలమె
పరఁగుఁ గద సిద్ధమగుచు ♦ బ్రహ్మానందా 95

తా. శ్రీసద్గురు కరుణవలనఁ బరిపూర్ణము నెఱిఁగి యాయెఱిఁగినగుర్తును విడిచినయెడల, మాయ యటుమాయమగును. అచలమొక్కటియే స్వతస్సిద్ధముగా నుండును.

జననము మరణము శూన్యం
బనునెంతయు నబ్రమగునె ♦ యశరీరుఁడై
తను శూన్యుఁజేసి కొనినఁ
బనివడిఁ బుట్టంగఁబోఁడు ♦ బ్రహ్మానందా 96

తా. అశరీరుఁడైనవానికి జననమరణములు లేవనుట యాశ్చర్యముగాదు. ఎప్పుడు తాను లేకపోయెనో యప్పుడే తనకుఁ బుట్టుకయును లేదు.

సురనర మృగతరుగిరులును
దరులు నదులుగహ్వరములు ♦ ధరఁబుట్టినయీ
వర రూపములన్నియు ద
బ్బర యని దెలియుంగవలయు♦బ్రహ్మానందా97

తా. దేవతలు, మనుష్యులు, మృగములు, వృక్షములు, పర్వతములు, గట్లు, నదులు, గుహలు మొదలగు నీప్రపంచమునఁ బుట్టిన సర్వరూపములును మాయయని తెలియవలెను.

కనుపించెడు నీ విశ్వము
కనుమూసినఁ దెలియ లేఘ ♦ కనుకట్టుసుమీ

కనుమాగుర సాజ్ఞను నీ
వను ననుమానంబుఁదొలఁచి బ్రహ్మానందా 98

తా. ఈ కనిపించెడు ప్రపంచము కనుమూసినఁ దెలియఁబడుటలేదు. ఇది గారడిమాయసుమా. గురుసాజ్ఞవలనఁబూర్ణము నెఱిఁగి, నీవను నెఱుకను విడువుము.

వరశిఖి కర్పూరంబులు
దరికొని యా రెండులేని ♦ తారాణముగన్
గురుతర చిజ్జడములు చనఁ
బరిపూర్ణమె యుండునెందు ♦ బ్రహ్మానందా 99

తా. అగ్ని కర్పూరములు సేరి మండి యాఱిపోయిన విధముగాఁ జిజ్జడంబులు చేరివ్యవహరించి, చనఁగాఁబరిపూర్ణమే స్వతస్సిద్ధమైయుండును.

ప్రకృతియు నాకృతి గానిది
వికృతులెవియుఁ బొరయనట్టి ♦ విశ్వాతీతం
బకలంకతఁ జూపి తిరిగ
ప్రకృతి పురుషరహిత భావ ♦ బ్రహ్మానందా 100

తా. ప్రకృతి పురుషద్వయ దోషరహితుఁడవగు నో గురుస్వామీ! ప్రకృతియు, నాకారమును, వికారములును నేవియుఁ బొందని ప్రపంచాతీతమైన పరిపూర్ణమును దెలిపితిరి.

జీవాత్మయు బరమాత్మయు
భావింపఁగలేని వనుచు ♦ భద్రాత్ముఁడవై

దీపింపుచు నా భ్రమలను
బావనుఁడవు త్రోలఁచినావు ♦ బ్రహ్మానందా 101

తా. జీవాత్మయును బరమాత్మయును లేదని తెలిపి నాభ్రమలను బోఁగొట్టి నన్నాశీర్వదించితిరి.

గీధవుఁడు మాధవుండు ను
మాధవుఁడును గుణములంచు ♦ మాకుఁ దెలిపి త
ద్గాధలను ద్రోలఁచి వారలు
బాధకులని తెలిపినారు ♦ బ్రహ్మానందా 102

తా. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు త్రిగుణములనియు, వారిగాధలు బాధలకు మూలములనియుఁ దెలిపినారు.

కనిపించి కానరానిది
వినిపించితి చూపితీరు ♦ విజ్ఞానాత్మా
తను మానినట్టిసదవిని
బనివడి సూచించినారు ♦ బ్రహ్మానందా. 103

తా. మాయాభ్రాంతు లుడిగినవారికిఁ దెలియఁబడునదియు, సచ్చిదానందమే పరిపూర్ణమనిభ్రమసినవారికిఁ దెలియఁబడనిదియు నగు తానులేని పరమపదమును బోధించితిరి.

పరమార్థంబిది యనుచును
మరణము జననంబులేని ♦ మార్గముమాకుఁ

బరికించి తెల్పినారలు
పరమాద్వయ పూర్ణభావ ♦ బ్రహ్మానందా. 104

తా. అద్వయాతీతమగు పరిపూర్ణుఁడవగు నో గురుదేవా! జననమరణములు లేని మార్గమగు పరమార్థమును దెలిపితిరి.

పరమపదంబును గంటిని
గురుశిష్యులు గలుగరందు ♦ గుర్తున్నదఁటం
చరసినఁ బతితుండగునా
పరమపదమె గురుపదంబు ♦ బ్రహ్మానందా. 105

తా. ఓ గురుస్వామీ! నేను బరమపదమును గ్రహించితిని. అందు గురుశిష్యులు లేకపోయిరి. దానియందు గుర్తున్నదనినఁ బాపాత్ముఁడై జననమరణములఁ బొందును. ఆపరమపదమే గురుపదమని తెల్పితిరి.

యువవత్సర కార్తికమునఁ
బ్రవిమల బహుళంబునందుఁ ♦ బంచమినాఁడా
కవివాసరమున శతకము
భవహర! మొదలిడెనుగాదె ♦ బ్రహ్మానందా.

తా. ఈ శతకము (108 పద్యములు), యువనామ సంవత్సర, కార్తీక బహుళ పంచమీ శుక్రవారమునాఁడు ప్రారంభింపబడెను.

ముదమున సప్తమి రవినిఁ
సదమలమతి నాశుకవియు ♦ సజ్జనహితుఁడుఁ
బదిలుఁడు నరసింహాఖ్యుఁడు
వదలక పూరించె దీని ♦ బ్రహ్మానందా. 107

తా. "ఆశుకవిశిఖామణి" పోకల వేంకటనరసింహారావు నాయనిచే, యువవత్సర కార్తీక బహుళ సప్తమీ భానువారము నాఁడు ముగింపఁబడెను.

ధర నెవ్వారేని యష్టో
త్తరశతకము దీనిఁ జదువ ♦ ధన్యులగుచుఁగాం
తురు జన్మంబులఁ బొరయని
పరిపూర్ణాచలము నెందు ♦ బ్రహ్మానందా. 108

తా. నూటయెనిమిది పద్యములుగల యీపుస్తకమును జదువువారు ధన్యులై, జననమరణములు లేని పరిపూర్ణాచల భావమును బొందుదురు.

స్వస్తి.

# ప్రకటన.

వావిళ్లవారివి, చల్లావారివి, ఆనంద, మ్యాక్ మిలన్, లాంగ్ మెన్సు వగైరా యితర కంపెనీలవి. సంస్కృత, ఆంధ్ర, హిందీ, ఇంగ్లీషు పుస్తకములు, స్కూళ్లకు సంబంధించిన పుస్తకములు, స్టేషనరీసామానులు, తోలు బాండు, స్టూడెంటు నోటుబుక్కులు, యక్సర్ సైజులు, సరసమైన ధరలకు మావద్ద విక్రయించబడును.

వలయువారు:—

ప్రిభల కామేశ్వరరావు,
ది మాడరన్ బుక్ స్టాల్,
బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,
మెయిన్ రోడ్, బెజవాడ.

శ్రీపరివ్రాజకాచార్య బ్రహ్మానందగిరిస్వాములచే

ప్రచురింపఁబడిన గ్రంథములు.

1. గురుపూజావిధానము (వేదోక్తము) వెల అ 4
2. బ్రహ్మానందశతకము (తాత్పర్యముతో) 4
3. పంచీకరణ రహస్యమను వేదాంత బాలశిక్ష } ఇవి అచ్చులో
4. బ్రహ్మానంద స్మృతి } నున్నవి.

ఈ గ్రంథములు వలయువారీ క్రింది విలాసములలో నెవరికైన వ్రాసి తెప్పించుకొనవచ్చును.

1. కడియాల బసవమ్మగారు, ఇప్పటముగ్రామము, పెదవడ్లపూడిపోస్టు, గుంటూరుజిల్లా.

2. ఎ. బి. చిన రాయప్పగారు, తిమ్మనచెర్లపోస్టు, అనంతపురంజిల్లా.

3. జంగం ఎల్లయ్యగారు, గాజులవ్యాపారము, బెజవాడ.